శ్రీ

# కోదండరామశతకము




గ్రంథకర్త

వంగనూరు చిన్న వేంకటస్వామి.

ఇది

కొండుపల్లె గారిమస్థుల ద్రవ్యసహాయముచే

ముద్రింపఁబడినది.

ఓం శ్రీ

# శ్రీ కోదండరామ శతకము

క॥ శ్రీమారుతి నుతమూర్తీ
సోమసరోజాప్తనేత్ర - సురుచిరకీర్తీ
నామస్తోత్రస్ఫూర్తీ
కోమలగుణ కొండుపల్లె - కోదండధరా. 1

క॥ శ్రీమద్గురుఁడగు నిన్నుఁ
భూమిమధ్యమునందు జొన్పి - పుణ్యసుపుష్పమ్ముల్
చేమిమఁదలిర్ప భజించెద
కోమలకర కొండుపల్లె - కోదండధరా. 2

క॥ శ్రీవేంకట నారాయణ
పావన గురుసార్వభౌము - పదముల నెపుడున్
భావోన్నతికై గొల్చెద
కోవిదనుత కొండుపల్లె - కోదండధరా. 3

క॥ గీర్వాణులు సర్వజ్ఞులు
నుర్వీసురవరులు నన్ను - నుత్తమపదవీ
ధుర్యునిఁజేయుత సుశ్రీ
గుర్వీకర కొండుపల్లె - కోదండధరా. 4

సుకవీశులఁ గొనియాడెద
ప్రకటిత రసవత్కవిత్వ - భాసురమతులన్
వికలతఁ బాయగ డెందము
శుకవిహారా కొండుపల్లె - కోదండధరా. 5

భాషాజ్ఞానము లేమిని
దోషంబులు మెండు, నిన్నుఁ - దొడరి నుతింపన్
దోషములంటవని శ్రుతుల్
ఘోషించును కొండుపల్లె - కోదండధరా. 6

క॥ కందంబుల నానంద
స్పందంబుల నందుకొనుము - ఛందం బెఱుఁగన్
విందును దాసుల కీవే
కుందనమని కొండుపల్లె - కోదండధరా. 7

క॥ శ్రీమద్భక్తజనాశ్రిత
కామితఫల కల్పవృక్ష - కమలదళాక్షా
శ్యామల నీరద సన్నిభ
కోమలరుచి కొండుపల్లె - కోదండధరా. ౮

క॥ శ్రీ సీతాహృదయాంబుజ
భాసా! సాకేతవాస! బ్రహ్మాదీశా
భాసురరవి సంకాశా!
గోసురధర కొండుపల్లె - కోదండధరా. 9

క॥ రారా సీతారామా!
రారా రఘువంశసోమ - రాక్షసభీమా
రారా కైదండము చే
కోరా, యిదె కొండుపల్లె - కోదండధరా. 10

క॥ భద్రాద్రినిలయ రారా
ఛిద్రములను భద్రపఱచు - చిద్ఘన రారా
అద్రిసుతా పతివినుతా
్రహరా కొండుపల్లె - కోదండధరా. 11

క॥ అప్పా, రామప్పా, మది
నొప్పగనిను నమ్మితి జగ - దుదారా! నన్
దిప్పలుబెట్టకు మొప్పల
కుప్పవుగద కొండుపల్లె - కోదండధరా. 12

క॥ ఏతీరునఁ దరిఁజేర్చెదో
యే తెరువునఁ దలఁపవలెనో - యెత్తెఱఁగున సం
ప్రీతుఁడవో త్రిప్పుము నా
కోతిమనసు కొండుపల్లె - కోదండధరా. 13

క॥ శ్రీవర కోసలదేశము
భూవరులు నుతింపదగిన - భువిని నయోధ్యన్
పావనముగ నేలితివఁట
కోవిదహిత కొండుపల్లె - కోదండధరా. 14

క॥ దశరథునకుఁ గౌసల్యకు
విశదంబుగ జననమంది - విద్యల నెల్లన్
కుశలంబుగ నేర్చితివఁట
కుశికజుచే, కొండుపల్లె - కోదండధరా. 15

క॥ తాటకిని ద్రుంచి, సింగిణి
ద్రేటున దానవ చయంబు - విదళించిన నీ
పాటవమేమని పొగడుదు
కూటస్థా! కొండుపల్లె - కోదండధరా. 16

క॥ విశ్వామిత్రుని యాగము
విశ్వము వెఱగందఁ గాచి - వెలయించితివో
శశ్వద్రుచి రక్షితఋషి
గోఽశ్వాదిక కొండుపల్లె - కోదండధరా. 17

క॥ దండము దశరథ నందన!
బండను సతిజేసినావు - పదహతిచేతన్,
దండిగ దాసులకున్ సిరి
కొండవురా కొండుపల్లె - కోదండధరా. 18

క॥ ఖండేందు ధరుని చాపము
ఖండితముగఁజేసి సీతఁ - గైకొన్నధరా
మండలనాయక వేడెద
కుండలిభృత్త కొండుపల్లె - కోదండధరా. 19

క॥ పరశువు ధనువునుగైకొని
పరుసము భార్గవుడుజూప - బలమును విల్లున్
విరసముతో లాగితివంట
గురుతముఁడవు కొండుపల్లె - కోదండధరా. 20

క॥ పట్టాభిషేక మప్పుడు
కట్టడి మంథరకులాగ్గి - కైకేయి నినున్
నట్టడవికి నెటులంపెనో
గుట్టుఁగనక కొండుపల్లె - కోదండధరా. 21

క॥ త్రిజటాఖ్యుండను విప్రుడు
భుజబలమున రాయిరువ్వఁ - బోయిన యంతన్
నిజముగు గోవుల నిచ్చిన
కుజనహారా! కొండుపల్లె - కోదండధరా. 22

క॥ మాతాపితరుల విడచియు
సీతాలక్ష్మణులగూడి - సిద్ధులతో నీ
వేతీ రడవిని నడచితో
కో! తీర్థద! కొండుపల్లె - కోదండధరా. 23

క॥ గుహుఁడెంతటి ఘనపుణ్యుఁడో
బహు సత్కారముల నడపి - పరమునుఁ గనియెన్
యిహపర ఫలప్రదాతవు
గుహవినుతా! కొండుపల్లె - కోదండధరా. 24

క॥ ఆరణ్యపథము జేరిన
వారించి విరాధుడంత - వనితను గొన నా
కూ్రురుని కరముల దునిమిన
ఘోరశరా! కొండుపల్లె - కోదండధరా. 25

క॥ శరభంగుని యాశ్రమమును
భారద్వజు నాశ్రమంబు - భాసురమతివై
దిరిగితివట నగమృగఖగ
గురుసరణుల కొండుపల్లె - కోదండధరా. 26

క॥ కందములను భుజియించుచు
నందముగా జడల, నార - యంబరముల నిం
పొందగ ధరియించితివట
కుందక శ్రీకొండుపల్లె - కోదండధరా. 27

క॥ ధాత్రీధరచిత్రాఖ్య
క్షేత్రమ్మున పంచవటిని - కేదారములన్
చిత్రముగఁ జరించితివా
గోత్రనుతా కొండుపల్లె - కోదండధరా. 28

క॥ గంగాయమునల, గౌతమి
తుంగతరంగముల, దివ్య - తుంగా కృష్ణో
త్సంగమములఁ గావేరిన్
గ్రుంగితివట కొండుపల్లె - కోదండధరా. 29

క॥ పాదములకెప్పుడు సోకుటఁ
బాదుకలే రాజ్యమేలె - భరతునిచే నా
పాదమె నెరనమ్మితి కా
కోదరధృత కొండుపల్లె - కోదండధరా. 30

క॥ కామించిన శూర్పణఖను
ప్రేమింపక ముక్కుఁజెవులుఁ - బెరికించిన నీ
నేమముజూడఁగ చోద్యము
కోమలులెడ కొండుపల్లె - కోదండధరా. 31

క॥ ఖరదూషణాది రాక్షస
పరివారమునెల్ల నేల - పాలుగజేయన్
తరమా సురులకునైనను
గురుశరుఁడవు కొండుపల్లె - కోదండధరా. 32

క॥ మారీచుఁడు హరిణంబై
పారెకునట సంచరింప - సతి నినువేడన్
బారిన విడువక గూల్చిన
కూరిమిపతి కొండుపల్లె - కోదండధరా. 33

క॥ కాకాసురు పెనునేరము
హా! కోపింపక క్షమించి - తాదరము మెయిన్
శ్రీకర! తనుకాంతివిజిత
కోకారి కొండుపల్లె - కోదండధరా. 34

క॥ దశరథసఖుఁడు జటాయువు
దశకంఠునిచేత విగత - తనుఁడైనఁ గృపన్
యశమును మోక్షమునిచ్చిన
కుశలివిగద కొండూపల్లె - కోదండధరా. 35

క॥ అష్టముగా బాహువుల నెదు
రొడ్డిన యసురుఁ గబంధు రూపడచితివో
దొడ్డదొరవనుచు తెలియరు
గొడ్డులకట! కొండుపల్లె - కోదండధరా. 36

క॥ తియ్యని పండులనిచ్చిన
చయ్యన శబరికినిముక్తి - సమకూర్చితివో
నెయ్యమలర్పగ గావుము
కుయ్యిడితిని కొండుపల్లె - కోదండధరా. 37

క॥ రవికులమున జన్మించియు
రవిశిష్యుని వార్తలెల్ల - రమ్యంబనియున్
రవిపుత్రునిఁ జేరితివఁట
కువలయనుత కొండుపల్లె - కోదండధరా. 38

క॥ దుందుభి కళేబరంబును
పొందుగ నఖకోటిఁజిమ్మి - పొడవడచితివో
సందియపడు భాస్కరసుతు
కుందెల్లను కొండుపల్లె - కోదండధరా. 39

క॥ ఆప్తముగా సుగ్రీవుఁడు
సప్తోత్తాళములఁజూప - శరమున నొకటన్
తప్తముగాఁ జేసితివో
గుప్తచరిత కొండుపల్లె - కోదండధరా. 40

క॥ హరిదశ్వసుతుఁడు ప్రిబలెను
హరిహయసుతు నొక్కకోల - హత మొనరింపన్
హరిహరి యేమనిపొగడుదు
గురికాడవు, కొండుపల్లె - కోదండధరా. 41

క॥ అంగద సుగ్రీవాదుల
సంగతి, సంగరము పనుల - సమకూర్చితివో
మంగళకరుఁడవు, ఖలులకుఁ
గొంగవురా, కొండుపల్లె - కోదండధరా. 42

క॥ అంగన వెదకుటకై కపి
పుంగవులనుఁ బంపుచుండి - పవనసుతునకే
యుంగర మొసఁగితివేలా
కొంగునవిడ కొండుపల్లె - కోదండధరా. 43

క॥ ఉన్నాడవు కొన్నాళ్ళటఁ
గన్నాడవు కపులనెల్ల - కాంతావార్తల్
విన్నాడవు ధనువును కై
కొన్నాడవు కొండుపల్లె - కోదండధరా. 44

క॥ పట్టితివి లంక తెరువును
గట్టితి వారధిని వార్ధిఁ - గైకసిసుతుఁ జేఁ
బట్టితివఁటఁ గోటలపడ
గొట్టితివా! కొండుపల్లె - కోదండధరా. 45

క॥ భండనమును, రక్షోవర
ఖండనమును, కుంభకర్ణ - ఖండనమును నొం
డొండయొనర్చితి, దశశిరు
గుండెలదుర కొండుపల్లె - కోదండధరా. 46

క॥ రామా! రావణు మరణము
భూమిజకును భువనములకు - భూమీశులకుఁ
గామిత ఫలదము సీతా
కోమలికయి కొండుపల్లె - కోదండధరా. 47

క॥ కొంకువడె నసురసురులకు
గొంకుడిగె, విభీషణాఖ్య - కోరిక దీరెఁ
గ్రుంకెను సతియనలంబున
కుంకుమకయి కొండుపల్లె - కోదండధరా. 48

క॥ ఉడుతకు మోక్షంబిచ్చుట
కడువేడుకగాదె నీకు - కరుణాభరణా
విడువవు, నీకుఁ భక్తులు
కొడుకులుగా కొండుపల్లె - కోదండధరా. 49

క॥ పదునాలుగేడు లడవియు
పదునాలుగువేలు రాజ్య - పరిపాలనముఁ
బదిలముగఁ జేయలేదే
కొదువయునఁ గొండుపల్లె - కోదండధరా. 50

క॥ వినవలెరా నీచరితము
గనవలెరా నీదుమహిమ - ఘనముగ నీవై
మనవలెరా, నీశీలముఁ
గొనవలెరా కొండుపల్లె - కోదండధరా. 51

క॥ లీలామానుష రూపివి
యీలాగు చరించినావు - యింపలరగ స
ద్వేలా! గుణజాలా! సుఖ
కూలా! హరి కొండుపల్లె - కోదండధరా. 52

క॥ అవతారంబులు పదియు, ని
రువదొక యంశావతార - రూపంబులు, నీ
వివిధ విభూతు లగణ్యము
కువలయనుత కొండుపల్లె - కోదండధరా. 53

క॥ వివిధాద్భుత లీలార్థము
లవితథముగ నుడివినార - లార్య ఋషులు ము
న్నవి తెలియగ నాతరమా
కువలయధర కొండుపల్లె - కోదండధరా. 54

క॥ పసపసయని సంసారులు
వెసనాసలు దొసగులనక - వశులై వసుధన్
పిసినికలై నిశిఁజిక్కిరి
గుసగుసలై కొండుపల్లె - కోదండధరా. 55

క॥ మోహాభ్రాంతిని వంచున్
దేహాత్మ మనస్సుడంచి - దేహినిగాంచున్
ఊహాలజించున్ నియతుఁడు
గోహితుఁడై కొండుపల్లె - కోదండధరా. 56

క॥ హితధర్మ లబ్ధకర్మల
మతిగోనినను బాధలేదు - మతి మంతులకున్
పతితుండగు నతిమోహియు
కుతలంబున కొండుపల్లె - కోదండధరా. 57

క॥ నేమముపీడక నెప్పుడు
బాములబడి చెడక భక్తి - భాగవత రతిన్
రాముని యాత్మారాముని
గోముగనును కొండుపల్లె - కోదండధరా. 58

క॥ అందేమో యిందేమో
సందేహములెల్లమాన్పి - సరగున నను నీ
యందే యుంచుము వేగమె
కుందెందుకు కొండుపల్లె - కోదండధరా. 59

క॥ తల్లియుఁ దండ్రియు గురులని
యుల్లముఁ బరికించిచూచి - యుండు నరునకున్
యెల్లప్పుడు మేలేయగు
కొల్లలుగను కొండుపల్లె - కోదండధరా. 60

క॥ ఎటువంటి పాపులైనను
పటుగతి నొకమారు నిన్ను - బల్కిన చాలున్
తటుకున వారిని గాతువు
గుటికలలో కొండుపల్లె - కోదండధరా. 61

క॥ రా యన గోయు నఘంబుల్
మా యన భవభయముమాయు- మాయయుబాయున్
కాయము వేరై తోచును
కోయిలఁగన కొండుపల్లె కోదండధరా. 62

క॥ మారాకుబుద్ధి లతకును
ధారాళంబయ్యెనేని - దాటును భవమున్
సారాసారము గననగు
కోర్కులగని కొండుపల్లె - కోదండధరా. 63

క॥ అంగములోపల రాముఁడు
మంగళముగ వెలుగునంచు - మాన్యులు బలుకన్
సంగతి దెలిసియు మనుజులు
కొంగలెగా కొండుపల్లె - కోదండధరా. 64

క॥ శ్రీరామా నినువేడియు
నారద వాల్మీకి ముఖ్యు - లరసిరి ముక్తిన్
యీరేడు జగములేలిక !
కోరితినిన్ గొండుపల్లె - కోదండధరా. 65

క॥ ఎటుగనుగొనువారికి నటు
పలుగతి పదిలుండవగుచు - పరగుదువీవే
యటుగావున నిటుజూడుము
గొటుకులువిడి కొండుపల్లె - కోదండధరా. 66

క॥ శ్రీరామాంక శుభాక్షర
పారాయణజేయువారి - పాపములెల్లన్
దూరములై సాయుజ్యముఁ
గోరకగను కొండుపల్లె - కోదండధరా. 67

క॥ దిక్కులుచూచిన దొరకవు
ముక్కుకొనం దృష్టినిలిపి - ముదమునజూడన్
గ్రిక్కున చిక్కుదువాక
గుక్కినటఁట కొండుపల్లె - కోదండధరా. 68

క॥ తల్లియు దండ్రియు నీవని
యుల్లములో నమ్మినాడ - యొప్పుగ నన్నున్
చల్లగ ముక్తికిఁ జేర్పుము
కొల్లలుగను కొండుపల్లె - కోదండధరా. 69

క॥ శ్రీరామ రామ రామా
సారెకు నీనామభజన - సల్పెద తండ్రీ
సారూప్యము సమకూర్పుము
కోరితిమది కొండుపల్లె - కోదండధరా. 70

క॥ కలియుగమున భజనంబే
ఫలదంబని పల్కిరెల్ల - పరిశోధకులున్
అలసట దలఁపకఁ దలఁచిన
కులఘనుఁడగు కొండుపల్లె - కోదండధరా. 71

క॥ సర్వము రామార్పణమని
యుర్విని చరియింపవలయు - నోపికతోడన్
గర్వము సర్వము వదలిన
గుర్వగు మరి కొండుపల్లె - కోదండధరా. 72

క॥ ఉత్సాహంబును మదినిడి
సత్సాంగత్యంబుఁ జేరి - చనిననరులకున్
వత్సలత వచ్చుముక్తి, స
కృత్సరణిన్ కొండుపల్లె - కోదండధరా. 73

క॥ కలవుమది సాహసించిన
నిలుకడగల ధీరవరుల - నిలయములందున్
కలఁగక వెలిగెదవఁట ! రఘు
కుల ఘనుఁడవు కొండుపల్లె - కోదండధరా. 74

క॥ మన్నింపుమయ్య రాఘవ
తిన్నగ నిను దెలియలేక - తిరిగితి నేనుర్విన్
కన్నారజూడు మొరయిడు
కొన్నాడను కొండుపల్లె - కోదండధరా. 75

క॥ మన్నింపుము శ్రీరామా
యెన్నెన్నో తప్పిదముల - యెఱుఁగని నేనుర్విన్
కన్నులు గానక కర్మకుఁ
గొన్నాడను కొండుపల్లె - కోదండధరా. 76

క॥ సాధన చతుష్టయంబిల
సాధించిన వారె ఘనులు - సత్యనిరతుఁలై
గాధలఁ వీడి భజించిన
గోధనుఁడగు కొండుపల్లె - కోదండధరా. 77

క॥ మనసున మాటల మార్గము
ననయము సర్వంబు దాను - నడపుచు వడిగా
వెనుకొని శిష్యుని నేలిన
గానవలె గురు కొండుపల్లె - కోదండధరా. 78

క॥ తనువును ధనమును మనమును
ననువుగ గురువరుని వసుగుం - ననయముపరతిన్
తను గనునతఁడగు ముక్తుఁడు
గునగుననో కొండుపల్లె - కోదండధరా. 79

క॥ కలిమియు బలిమియు చెలిమియు
కలయప్పుడె చలముపట్టి - గనవలెనిన్నున్
కల[illegible]ము విడిచెనేనియు
కులటుండగు కొండుపల్లె - కోదండధరా. 80

క॥ ఆశయె దుఃఖము నిచ్చు, ని
రాశయె సుఖకారణమ్ము - రమణులచూపే
పాశము యమసదనమునకు
కుశవందిత కొండుపల్లె - కోదండధరా. 81

క॥ విద్యయె సిరి, రసమొలికెడు
పద్యంబుల జెప్పువారె - పండితవర్యుల్
సద్యోముక్తులె నీకడ
కుద్యోక్తులు కొండుపల్లె - కోదండధరా. 82

క॥ కనకము కాంతలు జగతిని
ఘనమని మదికోరి జనులు - కానకనన్నున్
కనలేరు మిడుతల పోలిక
కునుకుదురల కొండుపల్లె - కోదండధరా. 83

క॥ జిహ్వను గోచిని గెలువక
వహ్వా భాషించుచుండ్రు - పరతత్త్వంబున్
ఆహ్వానము యమపురి కా
కుహ్వాంధులకున్ కొండుపల్లె - కోదండధరా. 84

క॥ చెండగవలె విషయంబుల
చెండగవలె కర్మపుంజ - సంవాసనలన్
చెండగవలె నుండగవలె
కుండలివలె కొండుపల్లె - కోదండధరా. 85

క॥ జీవుడనన్ దేవుడనన్
భావంబున గుట్టుదెలియు - పరుఁడేయగు నా
భావంబున నటులుండెడి
గోవిందుఁడ కొండుపల్లె - కోదండధరా. 86

క॥ మంచిది చెడ్డది యిదియను
సంచలనమె దోషమగును - సరిఁజూచినచో
మంచియె చెడ్డయు విశ్వము
కొంచెమొకో కొండుపల్లె - కోదండధరా. 87

క॥ వాసన, విషయము, విషువక
నాసరి మరియెవ్వరనుచు - నజ్ఞుఁడు పలుకున్
దాసుఁ డనండటు వాసన
కోసిగదా కొండుపల్లె - కోదండధరా. 88

క॥ మనసే మాయకు మూలము
మనసే భ్రమ, భోగపరత - మనసే, కర్మల్
మనసే సర్వము నిల్పిన
గోనసగునిన్ కొండుపల్లె - కోదండధరా. 89

క॥ కుజనుల చెంతకుఁ జేరక
సుజనుల సంసేవఁజేసి - సువిచారమునన్
భజనముఁ జేసిన ఘనుఁడగు
గుజగుజగన కొండుపల్లె - కోదండధరా. 90

క॥ తలఁపుల మెలఁగక తొలఁగియు
నిలబడు నోడలుండదనుచు - నిబ్బరము మదిన్
నిలుకడ నీపై యుంచిన
కొలలణగున్ కొండుపల్లె - కోదండధరా. 91

క॥ పరుడొక్కఁడె దైవంబని
పరికించియు పరముఁగలయ - బాల్పడవలయున్
మరిమరి మననముఁ జేసిన
గురుగననగు కొండుపల్లె - కోదండధరా. 92

క॥ భావములో నద్వైతము
భావింపగవలెను క్రియల - బాహ్యములోనన్
సేవింపగవలె సర్వులు
కోవిదులను కొండుపల్లె - కోదండధరా. 93

క॥ జ్ఞానము భక్తియు కర్మయు
పూనికతో మూడు విధుల - పొందగవచ్చున్
మానిచరించిన చెడుదురు
కోనలవలె కొండుపల్లె - కోదండధరా. 94

క॥ సూచనగానక నీచులు
వాచా వాదించినంత - వచ్చునెజ్ఞానం
బాచార విచారముగన
గోచరమగు కొండుపల్లె - కోదండధరా. 95

క॥ పరమంబన నానందము
పరగును స్వానందపరత - భక్తుల పొంతన్
తిరమగు సాధించినమది
గురుగననగు కొండుపల్లె - కోదండధరా. 96

క॥ శోధించి తత్త్వమెఱిగిన
మేధావులె పెద్దలరయ - మేదినిలోనన్
సాధింపక దొరకొనునే
క్రోధులకది కొండుపల్లె - కోదండధరా. 97

క॥ ఓంకారము బ్రహ్మంబ! య
హంకారము మదినిడిచి - హరిజేరదగున్
సంకల్పమె బంధంబగు
గొంకేలర కొండుపల్లె - కోదండధరా. 98

క॥ భావంబున నిదిగనినను
జీవుల కిహపరమ సుఖము - చిక్కును ముక్తిన్
నావయగుం భవజలధికి
గోవయగున్ కొండుపల్లె - కోదండధరా. 99

క॥ పరమాత్మని దర్శింపగ
పురుషార్థము పొందుటకును - పూనికతోడన్
దరిజేరుఁడు సద్గురువుల
గుఁరిగనుఁడిది కొండుపల్లె - కోదండధరా. 100

క॥ నరజన్మము సార్థకమఁట
నరుఁడగు పరమాత్మగూఁడి - యానందింపన్
తిరమగు హృదయధ్యానమె
గురురూపము కొండుపల్లె - కోదండధరా. 101

క॥ చిక్కును భక్తిని యుక్తిని
చిక్కుసదధ్యానసరణి - చింతించినచో
చిక్కునె మక్కువతిరిగెడు
కుక్కలకిది కొండుపల్లె - కోదండధరా. 102

క॥ నమ్మితి నీపద పద్మము
నమ్మితి నీనామభజన - నమ్మితి రామా
నమ్మితి నీచరితము నెఱ
గొమ్మది దయ కొండుపల్లె - కోదండధరా. 103

క॥ దానమెపస ధనికులకును
ధ్యానమెపస దానులకును - తాఁగనుగొనగా
జ్ఞానమెపస, పాలేపస
కూనలకును కొండుపల్లె - కోదండధరా. 104

క॥ ఉదయోదయంబు దీనిని
ముదమొప్ప పఠించిరేని - ముక్తినిఁ జేర్చున్
పదపడి సౌఖ్యము గల్గును
కొదువుండదు కొండుపల్లి - కోదండధరా. 105

క॥ శ్రీవంగనూరి పురమున
మావంగము బలిజ యంగ - మాంబకు సుతుఁడన్
గావంగఁదగినవాఁడను
గోవిందా కొండుపల్లి - కోదండధరా. 106

క॥ సుంకర వంశములోపల
పొంకముగా సుబ్బదాసు - పుత్రుఁడనఁ జి
న్వేంకటసామిని గావను
గొంకకురా కొండుపల్లి - కోదండధరా. 107

క॥ మంగళము నీకు రామా
మంగళమో సాధుపోష - మహనీయగుణా
మంగళము నాదరూపా
ఘుంగుంరవ కొండుపల్లి - కోదండధరా. 108

గురురామార్పణమస్తు.

ఓం తత్సత్.

